

శ్రీమతే రామానుజాయ నమః

# భూస్తుతి



శ్రీభూదేవి



'పండితరత్న'

డా|| ఉ. వే. శ్రీమాన్ ఈయుణ్ణి అళ్గగ శింగరాచార్యులు

సమర్పణ: వంగల వేంకట కేశవ అయ్యంగారు

# భూస్తుతి

**అవతారిక:**

ఇది భూదేవిని ఉద్దేశించి దేశికులచే రచింపబడిన స్తుతి. ఇందులో 33 శ్లోకాలున్నాయి. భూదేవిని యజ్ఞవరాహరూపాన్ని ధరించిన భగవానునకు పత్నిగా భావిస్తూ రచించిన స్తుతి ఇది. వైభవంలో లక్ష్మికి తరువాతి స్థానం భూదేవిదే. పూర్వం ఒకానొక సమయంలో హిరణ్యాక్షుడనే అసురుడు భూమిని అపహరించి, సముద్రంలోపల దాగాడు. అపుడు భగవానుడు వరాహరూపాన్ని ధరించి, సముద్రంలో ప్రవేశించి, ఆ అసురుని వధించి, భూమిని కాపాడిన వృత్తాంతం ఇందులో ప్రస్తావింపబడింది. భూదేవిని, భౌతికరూపంలోని పృథివిని ఒకటిగా భావించి, కొన్ని శ్లోకాలు రచింపబడ్డాయి.

ఈ స్తుతిలో దేశికులు మొదట భూదేవిని శరణు పొంది, తరువాత స్తుతించడానికి సాధ్యం కాని ఆమె వైభవాన్ని ప్రస్తుతించి. తమ ముద్దు పలుకులను అంగీకరించమని అర్థించారు. భూదేవి చేరికవల్ల భగవానునకు కలిగే అతిశయం, లోకాన్ని ఆమె పోషించే రీతి, ఆమె మహిమను తెలిపే ఆమె నామాలు, తత్త్వాలలో ఆమె చివరి తత్త్వమై ఉండడం, స్వామి అభిమానాన్ని ఆమె పొందడం, ఈమెవల్ల దేవతలకు కలిగే అతిశయం, జీవులకు ఈమె చేసే ఉపకారం, ఈమె సముద్రంలో మునిగిపోయిన వృత్తాంతం, సముద్రంనుండి ఉద్ధరింపబడడం, సర్వలోకేశ్వరిగా పట్టాభిషేకం, ఇహలోకపర లోకఫలాలకు ఈమె సాధనమై ఉండడం, రెండు రూపాలను కలిగి ఉండడం, యోగులచే ధ్యానింపబడడం, భగవానుని ఆశ్రయించడంలో జీవులకు ఈమె చేసే సహకారం మొదలైన విషయాలను విస్తృతంగా పలికి, చివరలో తమను కటాక్షించమని అర్థించి, చివరలో ధ్యానశ్లోకంతో దేశికులు ఈ స్తుతిని ముగించారు.

★★★★

1) సఙ్కల్పకల్పలతికా మవధిం క్షమాయాః,
స్వేచ్ఛావరాహ మహిషీం సులభానుకమ్పామ్ |
విశ్వస్య మాతర మకిఞ్చన కామధేనుం
విశ్వమ్భరా మశరణః శరణం ప్రపద్యే ||

కోరిన ఫలాలను ఇవ్వడంలో కల్పలతవంటిది, క్షమాగుణానికి పరమావధి, సులభంగా కరుణించేది, అకించనులకు కామధేనువు, తన సంకల్పంతో వరాహరూపాన్ని ధరించిన భగవానునకు పత్ని, జగత్తుకు తల్లి అయిన భూదేవిని , వేరు ఏ గతి లేని నేను, శరణు పొందుతున్నాను.

2) త్వం వ్యాహృతిః ప్రణమతః ప్రణవః ప్రియ స్తే
సంవేదయత్యఖిలమన్త్ర గణ స్తమేవ |
ఇత్థం ప్రతీతవిభవా మితరేష్విదానీం
స్తోతుం యథావదవనే క ఇవార్హతి త్వామ్ ||

భూదేవీ! గాయత్రీమంత్రానికి ముందు జపించే వ్యాహృతులలో "భూః" అనే మొదటి వ్యాహృతి నిన్ను తెలుపుతున్నది. ప్రణవం నీ నాథుని తెలుపుతున్నది. సమస్తమంత్రగణం నీ నాయకునే తెలుపుతున్నది. ఈ విధంగా ప్రసిద్ధి చెందిన వైభవాన్ని కల నిన్ను యథాతథంగా స్తుతించడానికి ఇపుడు ఇతరులలో ఎవరు యోగ్యులు?

3) నిత్యం హితాహిత విపర్యయబద్ధభావే
త్వద్వీక్షణైక వినివర్త్య బహు వ్యపాయే |
ముగ్ధాక్షరై రఖిల ధారిణి మోదమానా
మాతః స్తనన్ధయ ధియం మయి వర్తయేథాః ||

అన్నిటిని ధరించే భూమాతా! మంచి చెడ్డలను తారుమారుగా భావించేవాడను, నీ కటాక్షంతో మాత్రమే పోయే పలు పాపాలను చేసినవాడనైన నేను, పలికే ముద్దుమాటలతో సంతోషించి, "వీడు చంటిబిడ్డ"అనే భావంతో నా విషయంలో వర్తించు.

4) సఙ్కల్ప కింకర చరాచర చక్రవాలం
సర్వాతిశాయిన మనన్తశయస్య పుంసః |
భూమాన మాత్మవిభవైః పునరుక్తయన్తీ
వాచా మభూమిరపి భూమిరసి త్వమేకా ||

తన సంకల్పంతో జంగమస్థావరాలను అన్నిటిని వశం చేసికొన్న, అన్నిటికి మించిన, ఆదిశేషునిపై పరుండి ఉండే భగవానుని మహిమను నీ మహిమతో రెండింతలుగా చేస్తున్నదానవు, సాటి లేని వైభవాన్ని కలిగినదానవు అయిన నీవు స్తుతివచనాలకు భూమివి(అందేదానవు) కాకపోయినా భూమివై ఉన్నావు. (భూమి అనే పేరును కలిగి ఉన్నావు)

5) వేధ స్తృణావధి విహార పరిచ్ఛదం తే
విశ్వం చరాచరతయా వ్యతిభిద్యమానమ్ |
అమ్బ! త్వదాశ్రితతయా పరపోషయన్తీ
విశ్వమ్భరస్య దయితాऽసి తదేకనామా ||

తల్లీ! జంగమస్థావరభేదాన్ని కలిగినది, నీ లీలకు సాధనమైనది, బ్రహ్మ మొదలు తృణపర్యంతంగా ఉన్నది అయిన ఈశ లోకాన్ని, అది నిన్ను ఆశ్రయించి

ఉన్నందున చక్కగా పోషిస్తూ, లోకాన్ని భరించే విశ్వంభరుడైన భగవానునకు అతని పేరునే(విశ్వంభరా –అనే పేరునే) కలిగినదానవై, అతనికి ప్రియపత్నివై ఉన్నావు.

6) సర్వంసహేత్యవని రిత్యచలేతి మాతః!
విశ్వమ్భరేతి విపులేతి వసున్ధరేతి |
అన్యాని చాన్యవిముఖాన్యభిధాన వృత్త్యా
నామాన్యమూని కథయన్తి తవానుభావమ్ ||

తల్లీ!సర్వంసహా అని, అవని అని, అచలా అని, విశ్వంభరా అని, విపులా అని, వసుంధరా అని –, ఈ విధంగా ఇంకా ఉండే నీ పలు పేర్లు వేరెవ్వరిని తెలుపనివై, నేరుగా నీ మహిమను తెలుపుతున్నాయి.

7) తాపాన్ క్షిపన్ ప్రసవితా సుమనో గణానాం
ప్రచ్ఛాయశీతల తలః ప్రదిశన్ ఫలాని |
త్వత్సఙ్గమాద్భవతి మాధవి ! లబ్ధపోషః
శాఖా శతై రధిగతో హరిచన్దనోऽసౌ ||

భూదేవీ!తాపాలను తీరుస్తూ దేవతల సమూహాలను(పూల సమూహాలను) ప్రసవించేది, కరుణతో(అనే గొప్ప నీడతో) ఆశ్రయించినవారిని (పక్కన ఉండేవారిని)చల్లబరుస్తున్నది)చల్లని పాదాలను(మూలభాగాన్ని) కలిగినది, కోరిన మనోరథాలను(పండ్లను) ఇస్తూ, వందలాది వేదశాఖలతో కీర్తింపబడేది(వందలాది కొమ్మలను కలిగినది) అయిన ఈ హరి అనే హరిచందనవృక్షం నీ సంబంధంతో వృద్ధి పొందుతున్నది.

8) స్మేరేణ వర్ధితరసస్య ముఖేన్దునా తే
నిష్పన్దతాం విజహతో నిజయా ప్రకృత్యా |
విశ్రాన్తిభూమి రసి తత్త్వతరఙ్గపఙ్క్తేః
వేలేవ విష్ణుజలధే రపృథగ్భవన్తీ ||

చిరునవ్వుతో వికసించిన (పూర్ణమైన)నీ ముఖమనే చంద్రునివల్ల కరుణ అనే జలం వృద్ధి పొందింపబడినది(ఆనందాన్ని పొందినది), తన స్వభావంతో (మూలప్రకృతివల్ల) చలించకపోవడమనే స్వభావాన్ని విడచినది అయిన భగవానుడనే సముద్రానికి, తీరంవలె ఏనాడూ విడచి ఉండనిదానవై, తత్త్వాలనే కెరటాల వరుసలకు చివరి ఎల్లగా నీవున్నావు.

(భగవంతుడు ఒక సముద్రంవంటివాడు. చంద్రుని చూచినపుడు సముద్రజలం ఉప్పొంగుతుంది. ఆ విధంగానే. అతడు చంద్రునివంటి భూదేవిముఖంలోని చిరునవ్వును చూచినపుడు అతని కరుణ అనే జలం వృద్ధి అవుతుంది. సముద్రం ఎపుడూ తీరాన్ని దాటనట్లే, భగవానుడుకూడా భూదేవిని కాదని ఏ కార్యాన్ని చేయడు. సముద్రంనుండి పుట్టిన తరంగాలు తీరంవరకే ప్రవహిస్తాయి. ఆ విధంగానే భగవానునినుండి పుట్టే ప్రకృతి, మహాన్ మొదలైన తత్త్వాలలో భూమి చివరి తత్త్వం).

9) స్వాభావి  వసుమతి శ్రుతిభి ర్విభావ్యే
పత్యు ర్మహిమ్ని భవతీం ప్రతిపన్నవాసామ్ |
శఙ్కే విమానవహన ప్రతిమా సమానాః
స్తమ్బేరమ ప్రభృతయోऽపి వహన్తి సత్త్వాః ||

భూదేవీ! వేదాలచే తెలియదగినది, నీ ప్రభువునకు సహజమైనది అయిన మహిమలో భాగాన్ని పొందిన నిన్ను దిగ్గజాలు మొదలైన ప్రాణులుకూడా గోపురాన్ని ధరించే బొమ్మలవంటివై ధరిస్తున్నాయని తలుస్తాను.

(గోపురాలను కట్టినపుడు ఆ గోపురాలను కొన్ని బొమ్మలు ధరిస్తున్నట్లు అలంకారంగా నిలుపుతారు కాని, నిజానికి గోపురం బొమ్మను ధరిస్తున్నది తప్ప బొమ్మ గోపురాన్ని ధరించదు. ఆ విధంగానే దిగ్గజాలను భూమి ధరిస్తున్నది తప్ప భూమిని దిగ్గజాలు ధరించడం లేదు.)

10) సమ్భావయన్ మధురిపుః ప్రణయానురోధాత్
వక్షఃస్థలేన వరుణాలయ రాజకన్యామ్ |
విశ్వమ్భరే! బహుముఖప్రతిపన్నభోగః
శేషాత్మనా తు భవతీం శిరసా దధాతి ||

భూదేవీ!అనురాగంవల్ల సముద్రపుత్రి అయిన లక్ష్మిని వక్షఃస్థలంలో నిలుపుకొని గౌరవిస్తున్నా, భగవానుడు, పలు విధాలుగా నీవల్ల ఆనందాలను పొంది, (పలు ముఖాలను కల ఆదిశేషుని పడుకగా పొంది), ఆదిశేషుని రూపంలో నిన్ను తలపై ధరిస్తున్నాడు. (లక్ష్మిని కంటే నిన్ను ఎక్కువగా ప్రేమించినందున నిన్ను తన తలపై ధరిస్తున్నాడు).

11) క్రీడా వరాహదయితే! కృతినః క్షితీన్ద్రాః
సంక్రన్దన స్తదితరేऽపి దిశామధీశాః |
ఆమోదయన్తి భువనాన్యలికాశ్రితానాం
అమ్బ! త్వదఙ్ఘ్రి రజసాం పరిణామ భేదైః ||

లీలావరాహరూపాన్ని ధరించిన భగవానునకు పత్నివి అయిన తల్లీ!కార్యసమర్థులైన ప్రభువులు, ఇంద్రుడు, ఇంకా దిక్పాలకులు అందరు తమ తలలపై పడిన నీ పాదధూళికణాల పరిణామరూపాలైన అధికారాలను పొంది, లోకాలను ఆనందింపజేస్తున్నారు (భూదేవికటాక్షంవల్లనే ఈ లోకంలో, స్వర్గం మొదలైన ఇతరలోకాలలోని ప్రభువులు తమ తమ అధికారాలను పొందుతున్నారు).

12) భూతేషు యత్త్వదభిమానవిశేషపాత్రం
పోషం తదే భజతీతి విభావయన్తః |
భూతం ప్రభూతగుణపఞ్చకమాద్యమేవ
ప్రాయో నిదర్శనతయా ప్రతిపాదయన్తి ||

జీవులలో ఎవడు నీ అభిమానాన్ని పొందడానికి యోగ్యుడో, అతడే గొప్ప వృద్ధిని పొందుతున్నాడు–అని తలచేవారు రూపరసగంధస్పర్శశబ్దాలనే అయిదు గుణాలను అధికంగా కలిగినది, మొదటిది అయిన పృథివి అనే భూతాన్ని ఉదాహరణంగా పలుకుతారు.

13) కాంత స్తవైష కరుణాజలధిః ప్రజానాం
ఆజ్ఞాతిలంఘనవశా దుపజాతరోషః |
అహ్వాయ విశ్వజనని క్షమయా భవత్యా
సర్వావగాహనసహో ముపయాత్యవస్థాం ||

జగజ్జననీ!కరుణాజలధి నీకు నాథుడైన భగవానుడు చేతనుల విషయంలో, వారు తన ఆజ్ఞను మీరి నడచినందున కోపాన్ని కలవాడైనా,. క్షమాస్వరూపిణి అయిన నీవలన అందరు దరి చేరగలిగిన స్థితిని వెంటనే పొందుతాడు.

14) ఆశ్వాసనాయ జగతాం పురుషే పరస్మిన్
ఆపన్నరక్షణదశా మభినేతుకామే |
అన్తర్హితేతరగుణాదబలా స్వాభావాత్
ఔదన్వతే పయసి మజ్జనమభ్యనైషీః ||

పరమపురుషుడైన నీ నాథుడు లోకాలకు ఆశ్వాసాన్ని(ఓదార్పును) కలిగించడంకోసం ఆపద పొదినవారిని రక్షించే దశను పొందినట్లుగా అభినయించదలచినపుడు, మరగుపడిన ఇతరగుణాలను కల స్త్రీస్వభావంతో నీవు సముద్రంలోపల మనిగిపోయిన దశను అభినయించావు. (భగవానుడు వరాహావతారాన్ని ఎత్తి, తన ఆపద్రక్షకస్వభావాన్ని లోకానికి చూపదలచినపుడు, ఆ అభిప్రాయానికి తగినట్లు నీవు సముద్రంలో మునిగిపోయిన దశను అభినయించావు, తప్ప, నిజానికి నిన్ను రక్షించుకోగలిగిన శక్తి నీకున్నది).

15) పూర్వం వరాహవపుషా పురుషోత్తమేన
ప్రీతేన భోగిసదనే సముదీక్షితాయాః |
పాదాహతాః ప్రళయవారిధయ స్తవాసన్
ఉద్వాహమఙ్గళ విధే రుచితా మృదఙ్గాః ||

పూర్వం, వరాహరూపాన్ని ధరించిన పరమపురుషుడు, నిన్ను పాతాళలోకంలో చూచి, నీపట్ల చాలా ప్రీతిని పొంది, నిన్ను పాతాళంనుండి ఉద్ధరించి గ్రహించాడు. అది ఒక వివాహమంగళవిధివంటిది అపుడు స్వామి నిన్ను ఉద్ధరించే ప్రయత్నంలో తన పాదాలతో సముద్రజలాలను గట్టిగా కొట్టాడు. దాని వల్ల అపుడు వెలువడిన శబ్దాలు ఆ వివాహోత్సవసమయంలో మంగళంగా వాయింపబడి మద్దెల ధ్వనులవలె అయినవి.

16) వ్యోమాతిలజ్ఘిని విభోః ప్రళయామ్బురాశౌ
వేశన్త లేశ  ఇవ మాతు మశక్య మూర్తేః |
సద్య స్సముద్రవసనే! సరసై రకార్షీః
ఆనన్దసాగర మపార మపాఙ్గపాతైః ||

సముద్రాన్ని వస్త్రంగా కల భూదేవీ! ఆకాశాన్ని దాటి వ్యాపించిన ప్రళయసముద్రంలోకి చాలా పెద్ద రూపంతో వరాహమూర్తి నిన్ను ఉద్ధరించడానికి వచ్చినపుడు, అంత విశాలమైన సముద్రంకూడా అతనికి ఒక చిన్న నీటిగుంట అయినది. అతడు దాని లోపల మునిగి నిన్ను పైకి తీసికొనిరావడానికి వీలు లేనట్లుగా సముద్రం చిన్నది అయినది. అపుడు నీవు ప్రేమగా నీ కటాక్షాలతో స్వామిని వీక్షించగా, అతని ఆనందం గొప్ప సముద్రమై ప్రవహించింది. ఆ ఆనందసముద్రంలో భగవానుడు మునిగి నిన్ను పైకి తీసికొనివచ్చాడు. (అంత గొప్ప ఆనందాన్ని నీవు వరాహస్వామికి కలిగించావు).

17) దంష్ట్రా విదారిత మహాసురశోణితాఙ్కైః
అఙ్గైః ప్రియ స్తవ దధే పరిరమ్భలీలామ్ |
సా  తే పయోధి జలకేలి సముత్థితాయాః
సైరన్ధ్రికేవ విదధే నవమఙ్గరాగమ్ ||

నీ ప్రేమకు లక్ష్యమైన వరాహస్వామి తన దంతంతో హిరణ్యాక్షుడనే గొప్ప ఆసురుని వధించినపుడు, స్వామి శరీరం ఆ అసురుని రక్తంతో అంకితమైనది. రక్తచిహ్నాలను కల తన దేహంతో వరాహమూర్తి నిన్ను కౌగలించుకొన్నాడు. ఆ లీల (కౌగిలింత) సముద్రంలో జలక్రీడను ఆడి, పైకి లేచిన నీకు అలంకారం చేసే పరిచారిక(సైరంధ్రి)వలె నూతనమైన అంగరాగాన్ని(మైపూతను), పూసింది.

(హిరణ్యక్షుని రక్తంతో భూమి అంతా ఎర్రబడినందున, అపుడు, ఆమె నూతనమైన ఎర్రని మైపూతను పూసికొన్నట్టు కనిపించింది).

18) అన్యోన్య సంవలనజృమ్భితతూర్యఘోషైః
సంవర్తసిన్ధుసలిలై ర్విహితాభిషేకా |
ఏకాతపత్రయసి విశ్వమిదం గుణై స్స్వైః
అధ్యాస్య భర్తు రధికోన్నత మంసపీఠమ్ ||

భూదేవీ! ప్రళయకాలంలో సముద్రాలు ఒకదానితో ఇంకొటి తాకినపుడు వచ్చే ధ్వనులు పెద్ద తూర్యనాదాలవలె ధ్వనించగా, ప్రళయజలాలతో పట్టాభిషేకమాడిన నీవు, నీ పతి అయిన వరాహమూర్తి బాహువులనే ఉన్నతమైన సింహాసనాన్ని అధిష్ఠించి, నీ క్షమాదిగుణాలతో ఈ జగత్తును ఏకచ్ఛత్రాధిపత్యంగా ఏలుతున్నావు.

19) భర్తు స్తమాలరుచిరే భుజమధ్యభాగే
పర్యాకుమౌక్తికవతీ పృషతైః పయోధేః |
తాపానుబంధశమనీ జగతాం త్రయాణాం
తారాపథే స్ఫురసి తారకితా నిశేవ ॥

భూదేవీ!మూడు లోకాలకు కలిగే తాపాల పరంపరను తీర్చే నీవు సముద్రంనుండి ఉద్ధరింపబడినపుడు, తెల్లని సముద్రజలాల కణాలు పడినపుడు, అవి నీ శరీరంపై అందంగా, అలంకారంగా ప్రకాశించే ముత్యాలవలె భాసించాయి., తమాలవృక్షంవలె నల్లగా, అందంగా ఉండే నీ పతి వక్షస్సుపై, ఆకాశంలో నక్షత్రాలతో కూడిన రాత్రివలె అపుడు ప్రకాశిస్తున్నావు. (వరాహమూర్తి వక్షస్సు ఆకాశంవలె, జలకణాలు నక్షత్రాలవలె, భూదేవి రాత్రివలె ఉన్నాయి.

20) ఆసక్తవాసవశరాసనపల్లవై స్త్వాం
సంవృద్ధయే శుభతటిద్గుణజాలరమ్యైః |
దేవేశ దివ్యమహిషీం దృతసిన్ధుతోయైః
జీమూతరత్నకలశై రభిషిఞ్చతి ద్యౌః ||

భూదేవీ!లోకంలో ప్రభువుకు పట్టమహిషి అయిన స్త్రీని వేరొక సుమంగళి రత్నాలు పొదిగిన కలశాలకు తెల్లని దారాలను చుట్టి, వాటిలో మంగళంగా మామిడి ఆకులను పెట్టి, సముద్రజలాన్ని నింపి స్నానాన్ని చేయించడం సంప్రదాయం. ప్రకృతంలో, మేఘాలే రత్నాలు పొదిగిన కలశాలు. ఆకాశంలోని ఇంద్రధనుస్సే మామిడి ఆకులు. మేఘాలలో ప్రకాశించే మెరపులే కలశాలకు చుట్టిన తెల్లని దారాలు. ఈ విధంగా ఆకాశమనే వనిత ఇంద్రధనుస్సు అనే మామిడి ఆకులను, మెరపులనే తెల్లని నూలుదారాలతో చుట్టిన మేఘాలనే కలశాలలో చేర్చి, సముద్రజలాన్ని నింపి, పట్టమహిషివి అయిన నిన్ను అభిషేకిస్తున్నవి.

21) ఆవిర్మదై రమరదన్తిభి రుహ్యమానాం
రత్నాకరేణ రుచిరాం రశనాగుణేన |
మాత స్త్రిలోక జననీం వనమాలినీం త్వాం
మాయావరాహమహిషీమవయన్తి సన్తః ॥

భూదేవీ! మదజలాన్ని స్రవించే దిగ్గజాలచే తలలపై ధరింపబడేదానవు, రత్నాలు నిండిన సముద్రమనే మొలనూలుతో అందంగా ఉండేదానవు, వనమాలను ధరించిన భగవానునకు పత్నివి, (వనాలతో నిండినదానవు), ముల్లోకాలకు తల్లివి (ముల్లోకాలకు కారణం) అయిన నిన్ను తన సంకల్పంతో ఆవిర్భవించిన వరాహస్వామికి పట్టమహిషివి అని మహాత్ములు తెలిసికొంటున్నారు.

22) నిష్కణ్టక ప్రశమయోగనిషేవణీయాం
ఛాయావిశేషపరిభూతసమస్తతాపామ్ |
స్వర్గాపవర్గసరణిం భవతీ ముశన్తి
స్వచ్ఛన్దసూకరవధూ మవధూతపఙ్కామ్ ॥

భూదేవీ!షమహాత్ములు, తన సంకల్పంతో అవతరించిన వరాహమూర్తికి పత్నివి అయిన నిన్ను స్వర్గం, మోక్షం మొదలైనవానిని పొందించే మార్గంగా (ఉపాయంగా) ఆశ్రయిస్తున్నారు. దారి అనేది బురద లేనిదై ఉండాలి. నీవు ఏ దోషాన్ని లేనిదానవు. దారిలో ముళ్ళు ఉండకూడదు. నీవుకూడా ఏ అడ్డు లేకుండా శమాదులతో యోగాన్ని అనుష్ఠించేవారు ఆశ్రయించడానికి వీలుగా ఉన్నావు. నడిచే దారిలో చెట్ల నీడ ఉంటే నడిచేవారి తాపం తీరుతుంది. నీవు భక్తులను చక్కగా కాపాడడంవల్ల వారి తాపాలన్నీ తీరుతున్నాయి. ఇందువల్ల మోక్షాది పురుషార్థాలను కోరేవారికి నీవు తగిన సాధనమై, కోరిన ఫలాలను పొందిస్తున్నావు.

23) గణ్డోజ్జ్వలాం గహనకున్తలదర్శనీయాం
శైలస్తనీం తరలనిర్ఝర లమ్బహారామ్ |
శ్యామాం స్వత స్త్రియుగ సూకర గేహిని! త్వం
వ్యక్తిం సముద్ర వసనా ముభయీాం బిభర్షి ॥

జ్ఞానాది ఆరు గుణాలను కల వరాహమూర్తికి పత్నివి అయిన తల్లీ! నీకు రెండు రూపాలున్నాయి. ఒకటి, జంగమమైన స్త్రీరూపం. ఇంకొకటి సముద్రపరివేష్ఠితమైన పృథివీరూపం. నీ. స్త్రీరూపం –అందమైన చెక్కిళ్ళను కలిగినది. దట్టమైన కేశపాశంతో చక్కనిది. పర్వతాలవంటి స్తనాలను కలిగినది. వక్షఃస్థలంలో ముత్యాల మాలను కలిగి ఉన్నది. నీలవర్ణంతో, మంచి యౌవనపరువంలో ఉన్నది. పేటలతో కూడిన మొలనూలును కలిగినది. ఆ

విధంగానే, నీ స్థావరరూపం –చెక్కిళ్ళవంటి పలు పర్వతాల చరియలను కలిగినది. అందమైన, కేశపాశంవంటి వనసీమను కలిగినది. పెద్ద పెద్ద స్తనాలవంటి పర్వతాలను కలిగినది. ముత్యాల మాలవంటి సెలయేళ్ళను కలిగినది. నల్లనిది. మొలనూలువంటి సముద్రాన్ని చుట్టూ కలిగినది.

24) నిస్సంశయేన నిగమసీమని విష్ణుపత్ని!
ప్రఖ్యాపితం భృగుముఖై ర్మునిభిః ప్రతీతైః |
పశ్యన్త్యనన్య పర ధీ రస సంస్తుతేన
సన్త స్సమాధినయనేన తవానుభావమ్ ॥

విష్ణుపత్నీ!మహాత్ములు, వేదభాగాలలో ఏ సంశయం లేనివారై, ప్రసిద్ధి చెందినవారైన భృగువు మొదలైన మునులు మిక్కిలి ప్రసిద్ధి పొందిన నీ మహిమను తమ అనన్యమైన బుద్ధిసామర్థ్యంతో (స్థిరచిత్తంతో)సంస్కరింపబడిన యోగమనే నేత్రంతో దర్శిస్తున్నారు.

25) సంచోదితా కరుణయా చతురః పుమర్థాన్
వ్యాతన్వతీ వివిధమన్త్ర గణోపగీతా |
సఞ్చిన్త్యసే వసుమతి! స్థిరభక్తిబన్ధైః
అన్త ర్బహిశ్చ బహుధా ప్రణిధానదక్షైః ॥

భూదేవీ!కరుణతో ప్రేరేపింపబడిన నీవు, నాలుగు విధాలైన పురుషార్థాలను అనుగ్రహిస్తావు. పలు మంత్రాలతో స్తుతింపబడుతున్నావు. ధ్యానంలో సమర్థులై, నీపట్ల స్థిరమైన భక్తిబంధాన్ని కలవారు నిన్ను మనస్సులో ధ్యానిస్తున్నారు. బయట నీ అర్చారూపాన్ని దర్శించి. సేవించి, దానిని చింతిస్తున్నారు.

26) క్రీడాగృహీత కమలాది విశేషచిహ్నాం
విశ్రాణితాభయవరాం వసుధే! సభూతిమ్ |
దౌర్గత్య దుర్విషవినాశ సుధానదీం త్వాం
సఞ్చిన్తయన్వి లభతే ధనదాధికారాన్ ॥

లీలగా చేతిలో ధరించిన తామరపూవు మొదలైన విశేషచిహ్నాలను కలిగినదానవై, అభయాన్ని ఇచ్చే హస్తాన్ని కలిగినదానవై, దుర్గతిని కలిగి ఉండడమనే క్రూరమైన విషాన్ని పోగొట్టడంలో అమృతప్రవాహంవలె ఉండే నిన్ను ఆన్ని విభూతులతో ధ్యానించేవాడు కుబేరుని అధికారాన్ని పొందుతున్నాడుకదా!

27) ఉద్వేల్లకల్మష పరమ్పరితాదమర్షాత్
ఉత్తంసితేన హరిమఞ్జలినాప్యధృష్యమ్ |
ఆకస్మికోఽయ మధిగమ్యయతి ప్రజానాం
అమ్బ! త్వదీయకరుణాపరిణామ ఏవ ॥

భూదేవీ!జీవులు. చేసే అవధి లేని పాపాలవల్ల భగవానునకు కలిగే కోపం, వారు చేసిన అంజలివల్లకూడా తీరదు. అపుడు నిర్హేతుకమైన ఈ నీ కరుణాపరిణామమే వారిని స్వామి దరిచేరి ఆశ్రయించేటట్లు చేస్తుంది.

28) ప్రత్యేక మబ్జనియుతైరపి దుర్వ్యపోహాత్
ప్రాప్తే విపాకసమయే జనితానుతాపాత్ |
నిత్యాపరాధనివహా ణచ్చకితస్య జన్తోః
గన్తుం ముకున్దచరణౌ శరణం క్షమే త్వమ్॥

తల్లీ!భగవానుడు సదా జీవులను రక్షించే ఉద్దేశ్యంతో సులభుడై ఉన్నా, సంసారరీతినిబట్టి ఏదో ఒక విధమైన ఉపాయానుష్ఠానాన్ని వారినుండి అతడు ఎదురు చూస్తాడు. కనుక, వారి రక్షణలో ఆలస్యం అవుతుంది. అపుడు, ఏ దోషం

లేని కరుణను కల నీవు జీవులను కాపాడే విషయంలో గొప్ప సంకల్పాన్ని నీవే చేస్తున్నావు. (వారిచే ఏదో ఒక ప్రయత్నాన్ని చేయించి, భగవానుడు వారిని రక్షించేటట్లు చేస్తున్నావు).

29) త్రాణాభిసన్ధి సుభగేऽపి సదా ముకున్దే
సంసారతన్త్ర వహనేన విలమ్బమానే |
రక్షావిధౌ తనుభృతా మనఘానుకమ్పా
మాతః! స్స్వయం వితనుషే మహతీ మపేక్షామ్ ॥

భూదేవీ! లక్షలాది సంవత్సరాల కాలమైనా, జీవులు చేసిన ఒక్క పాపాన్ని పోగొట్టడానికికూడా చాలదు. ఆ పాపాలు ఫలాన్ని ఇచ్చేటపుడు వారికి చాలా పశ్చాత్తాపాన్ని కలిగిస్తాయి. ఇటువంటి పాపాలను వారు నిత్యం చేస్తున్నారు. తాము చేసిన ఈ పాపకూటాన్ని చూచి వారు భయపడినపుడు, నీవు వారు స్వామి చరణాలను ఆశ్రయించడానికి తగిన ఉపాయమవుతున్నావు.

30) ధర్మద్రుహంసకలదుష్కృతి సార్వభౌమం
ఆత్మానభిజ్ఞ మనుతాపలవోజ్ఝితం మామ్ |
వైతానసూకరపతే! శ్చరణారవిన్దే
సర్వం సహే నను సమర్పయితుం క్షమా త్వమ్ ॥

భూదేవీ! ధర్మకార్యాలను చెడగొట్టేవాడను, పాపులకు చక్రవర్తిని, నా స్వరూపాన్ని, పరమాత్మస్వరూపాన్ని తెలియనివాడను, కొంచెంకూడా పశ్చాత్తాపాన్ని లేనివాడను అయిన నన్ను యజ్ఞవరాహమూర్తి చరణపద్మాలలో సమర్పించడానికి నీవు శక్తిని కలిగినదానవుకదా!

31) తాపత్రయీం నిరవధిం భవతీ దయార్ద్రాః
సంసారఘర్మ జనితాం సపది క్షిపన్తః |
మాత ర్భజన్తు మధురామృత వర్షమైత్రీం
మాయావరాహ దయితే!, మయి తే కటాక్షాః ॥

తల్లీ!తన సంకల్పంతో అవతరించిన యజ్ఞవరాహమూర్తికి పత్నీ! నీ కరుణవల్ల చల్లనివి, సంసారమనే వేడిమివల్ల కలిగిన అంతు లేని తాపత్రయాలను వెంటనే పోగొట్టేవి అయిన నీ కటాక్షాలు నాపై మధురామృతవర్షంవలె కురియాలి.

32) పత్యుర్దక్షిణ పాణిపఙ్కజ పుటే విన్యస్త పాదామ్బుజా
వామం పన్నగసార్వభౌమ సదృశం పర్యఙ్కయన్తీ భుజమ్ |
పోత్రస్పర్శ లసత్కపోల ఫలకా ఫుల్లారవిన్దేక్షణా
సా మే పుష్యతు మఙ్గలాన్యనుదినం సర్వాణి సర్వంసహా ॥

నాథుడైన వరాహస్వామియొక్క కుడి హస్తపద్మంలో పెట్టిన పాదపద్మాన్ని కలిగినదై, ఆదిశేషునకు సమానమైన అతని ఎడమ చేతిని శయ్యగా చేసికొన్నదై, వరాహమూర్తి కపోలస్పర్శవల్ల రోమాంచాన్ని పొందిన పలకంవంటి కపోలాన్ని కలిగినదై, వికసించిన తామరలవంటి నేత్రాలను కలిగినదైన ఆ భూదేవి ప్రతిదినం నాకు అన్ని మంగళాలను వృద్ధి చేయాలి.

33) అస్యేశానా జగత ఇతి యా శ్రూయతే విష్ణుపత్నీ,
తస్యాః స్తోత్రం విరచిత మిదం వేఙ్కటేశేన భక్త్యా |
శ్రద్ధా భక్తి ప్రచయ గురుణా చేతసా సంస్తువానో
యద్యత్కామ్యం సపది లభతే తత్ర తత్ర ప్రతిష్ఠామ్ ॥

భగవానునకు పత్ని అయిన ఏ భూదేవి ఈ లోకానికి ఈశ్వరి అని, వేదంలో అధ్యయనం చేయబడుతున్నదో, ఆ దేవిని ఉద్దేశించి వేంకటేశులనే వేదాంతాచార్యులవారిచే భక్తితో రచింపబడిన ఈ స్తుతిని శ్రద్ధాభక్తులతో, మిక్కిలి గాఢమైన మనస్సుతో స్తుతించేవాడు కోరుకొన్న కోరికలను అన్నిటినీ వెంటనే పొందగలడు.

కవితార్కిక సింహాయ కల్యాణ గుణశాలినే,
శ్రీమతే వేఙ్కటేశాయ వేదాన్తగురవే నమః ॥

భూస్తుతి సంపూర్ణమ్

★★★★★